ఎల్ల దేవతలచేత నుపకరింపంబడువారలై గాన వారల నారాధించు యజ్ఞములం గల్పించి వానిం జూచి యానందించునట్లు వారలకు సుఖకారములం గల్పించి యవియును హవిర్భాగములను సేరం దారతమ్య ఫలములగునట్లు కల్పించి దానం బ్రీతులై యవి సేయు ప్రజలకు నభీష్టఫలంబులొసంగునట్లు కల్పించెం గాన వారలు సేసినవియుం జేయునవియునగు నుపకారంబులకై యజ్ఞములం జేయుట యున్న గానావశ్యకము. అట్లు సేయని వారలీశ్వర నిగ్రహపాత్రంబులగుదురు.

శ్లో॥ సహయజ్ఞైః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః। అనేన ప్రసవిష్యధ్వమేష వోఽస్త్విష్టకామధుక్। దేవాన్ భావయతాఽనేన తే దేవా భావయంతు వః। పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ। ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః। తైర్దత్తానప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః। యజ్ఞశిష్టాశినస్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః తే త్వఘం భుఞ్జతే పాపా యే పచన్త్యాత్మ కారణాత్ ॥

అని భగవద్గీతాతృతీయాధ్యాయమున నీయర్థంబె చెప్పంబడినది.

యజ్ఞంబులలోఁ బశుయాగములు పశుహింసారూపంబులుగాన నవి యధర్మ ప్రత్యవాయములగు

అని యిట్లు ప్రత్యవాయంబు స్మృతులం జె
ప్పంబడినది-

ఇందుంగొందఱివి సేయకున్నం బ్రత్యవాయంబు
వచ్చునని కియ్యకొనరు- మఱియేకున్నను- ఇవి సే
యుచో నున్న చేసిన పాపంబులు వోవును- అవి సే
యకున్నచో నపాపంబులు నిలిచి యుండుననుట
యే ప్రత్యవాయము చెప్పువచనముల కెల్ల నర్థము
నిత్యముగాఁ జేయుచున్న యుదక ప్రాశనంబులం
జెప్పుచున్న- సూర్యశ్చ- ఆపః పునంతు- అగ్నిశ్చ
అను మంత్రముల నివి పాపంబులం బోఁగొట్టుననుట
స్పష్టముగాఁ గానవచ్చుచున్నది- అని చెప్పుదురు-
ఇందు ప్రథమపక్షమే వచనస్వరససిద్ధము-

నిత్యనైమిత్తికంబులు ప్రత్యవాయంబు నడం
చుచుండియు నభ్యుదయ ఫలంబులుంగూడ నొసం
గుచుండును- అందుకు మయివర్చోబలమోజోనిధత్త
ఇత్యాది మంత్ర లింగములే సాధకములు.

త్రయో ధర్మస్కంధా ఇత్యాది ఛాందో
గ్యవాక్యము మూడాశ్రమంబులు నుత్తమలోకహేతు
వులనియుం జతుర్థాశ్రమము మోక్షప్రదంబని
యుం జెప్పుచున్నది- తద్యథా ఆమ్రే ఫలార్థే నిమిత్తే
ఛాయాగంధ ఇత్యనూత్పద్యేతే ఏవం ధర్మంచ
ర్యమాణమర్థా అనూత్పద్యంతే · అను నాపస్తంబస్మృ

ణి యోంగలదు- అక్రోనిమి త్త ఇత్యాదిహ్యేవ స్మృత్యుక్తేః - ఫలవత్త్వ నహాను ష్ఠి నిత్యానాం కర్మణాం ॥ అని విశ్వరూపాచార్యుల వాక్యము.

వేదోదితం స్వకం కర్మ నిత్యం కుర్యాదతన్ద్రితః। తద్ధికుర్వన్యథా శక్తిప్రాప్నోతి పరమాంగతిమ్- అని మనుస్మృతి.

నకర్మణా న ప్రజయాధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః-అను శ్రుతియందుం గర్మములు మోక్షసాధనంబనుట నిషిద్ధంబయ్యెనే యందురు- కాను- సాక్షాన్మోక్ష సాధనము జ్ఞాన విశేషంబె- అయిన నివి జ్ఞానోత్పత్తి కొండె జ్ఞానేప్సోత్పత్తికొండె సాధనంబులయి పరంపరచే మోక్ష సాధనంబులగును- తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసానాశకేన అను శ్రుతి యీ యర్థమునే తెల్పుచున్నది - అత ఏవచాగ్నీన్ధనాద్యనపేక్షా అనియు సర్వాపేక్షా చ యజ్ఞాది శ్రుతేరశ్వవత్ అనియు రెండధికరణంబులనిది తెల్లమగును.

ఇట్లు నిత్యకర్మంబులకుం బ్రత్యవాయ పరిహారంబును పుణ్యలోక ప్రాప్తియను నభ్యుదయంబును నిశ్శ్రేయసానుకూలబ్రహ్మజ్ఞానంబునను మూడు ఫలంబులు గలవు- అన్నైనచో నివి ప్రతి దినంబును మానవులు ప్రవర్తింప వలయునని యొం

శుద్ధ్యనురోధతః॥ అని యద్వైతవార్తికకారవచనము
కామ్యకర్మంబులును ఫలసంగము విడిచి సే
యుచో నిత్యతుల్యములే యగును మోక్షేచ్ఛకలవా
రలు నిత్యనైమిత్తికములం దప్పక సేయవలయును.
కామ్యములు చేసినం జేయవచ్చును - అన్నికర్మము
లయందును ఫలసంగకర్తృత్వములవిడువ వలయును.

యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజ
య। సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉ
చ్యతే। కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన।
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోస్త్వకర్మణి॥ అని
యును భగవద్గీతావచనములు-

ఇట్లు నిత్యనైమిత్తిక కర్మములు సంస్కా
రకంబులును మోక్షోపయుక్తంబులునని రెండు తెఱం
గులయ్యె - విహితత్వమాత్రబుద్ధిం జేయునవి సంస్కా
రకములు - ఫలసంగము విడిచి యీశ్వరార్పణబుద్ధి
చేతం జేయునవి వివిదిషాద్వారమునను౦డి వేదన
ద్వారంబుననుండి మోక్షోపయుక్తంబులగును.

ఇట్లు ఫలసంగము మోక్షవిరోధియయిన
చోఁ బరమప్రమాణంబగు వేదమున నిట్టిఫలముం
గోరువారలిట్టి కర్మములం జేయవలయునని యేల
విధించవలెనన్నను - వినుండు.

కర్మనైష్ఫల్యమానసగ్రాహులు కర్తృత్వ్రము

ణులును రజః ప్రచురులును తమః ప్రచురులునని మూడు తెగలవారగుచుందురు. వీరలు వరుసను నుత్తమ మధ్యమాధములనఁబడుదురు. ఇందు సత్త్వ ప్రచురులు మోక్షార్హులగుదురు. గాని యితరులట్లుగారు. వీరలవిభాగము లెస్సగా గుణత్రయ సంగ్రహమునం దెలుపంబడునందుం జూచికొనునది. రజస్తమః ప్రచురులు వర్తమాన జన్మమున మోక్షార్హులు గాకుండుటచే వారలకు వలయునభీష్టములం జెప్పకున్నచోఁ జెడుదురుగాన మాతాపితృసహస్రముల కంటె నువత్సలతరుండగు నీశ్వరుని శాసనంబగు వేదము వారివారి యిష్టలాభము లెల్లనుపదేశించు నందు మోక్షార్థితనకు వలయు విధుల నే గ్రహించి ఫలకామనలు విడుచునది. ఈయర్థంబె భగవద్గీతలలో త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున। అనియు. యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే। తావాన్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః. అనియుం జెప్పఁబడినది.

ఇట్లు వేదోక్తములగు కర్మంబులు ఫలసంగము విడిచి చేయుచుండ క్రమమునం దనంతనె స్థితప్రజ్ఞతయను నధికారముగలిగి జ్ఞానసంపన్నుండై పరమాత్మధ్యానమున మోక్షమునుం జెందు నిట్లు

# నమః పరమఋషిభ్యః

## అలంకార సంగ్రహము.

---

మేలుఁగీడులం బ్రవృత్తినివృత్తులం బుట్టించుట శబ్ద ప్రమాణమునకు ముఖ్యప్రయోజనము - అట్టి శబ్దప్రమాణమే శాస్త్రమనంబడును - అది ప్రభుసంమితంబును సుహృత్సంమితంబును కాంతాసంమితంబునని మూడు విధములనుం గను - ఆయావిధివాక్యంబు లెల్లం బ్రభుసంమితములు ఒకం డిట్టి పని చేసి మేలుం జెందెననియు మఱియొకం డిట్టి పనిచేసి కీడుం జెందెననియు నిదర్శనంబులం జెప్పి యీపని సేయుట మేలీ పని సేయుట కీడని తెల్పునది సుహృత్సంమితము - మఱియొక విషయముం జెప్పుచుండు నంతనే యిది మేలిది కీడని తెలియుటకుం జాలిన చతురోక్తి కాంతాసంమితము - తరుచుగా వేదము ప్రభుసంమితము - పురాణము సుహృత్సంమితము - కావ్యము కాంతాసంమితము - చమత్కారముం బుట్టించు కవిప్రబంధము కావ్యము - చమత్కారమనఁగా విలక్షణానందము - చమత్కారోక్తులు మంచిమాటలను వినం వులేనివారికి నైకమింపుం బుట్టించును - కావుననే వేదమునం దర్థవాదంబులయందుం బురాణంబులయందుం గూడ నట్టి వాక్యంబులకుం దక్కుఁ దంగెళ్లు.

చమత్కారంబుం బుట్టించు తెఱంగులు రెం

డు గలవు- వ్యంజన మొకటి- అలంకార మొకటి-
వ్యంజన మనఁగా శక్తిలక్షణలలో నొకవ్యాపారం
బునం జెప్పనర్థంబుగాక మఱియొక యర్థం
బుం దోపించుట- అట్టి యర్థంబు వ్యంగ్యమనంబ
డును- దానిందోపించు శబ్దము వ్యంజక మనంబ
డును.

శబ్దశక్తిమూలంబు నర్థశక్తి మూలంబు ను
భయశక్తి మూలంబునని వ్యంజనమునకు మూడు
తెగలుగలవు- ఉ. వాహినులసర్వతో ముఖవేగంబుగం
టివేఁగని యిట్లు సైన్యంబులంజూచి చెప్పినచో నదు
లజలవేగంబుఁజూచితివే యనియుందోచునిట్టిది శ
బ్దశక్తి మూలంబు.

ఆ రాజు పరాక్రమంబు విని రాజులు మోము
వంచికొనిరి. అని యిట్లు చెప్పినచో రాజులు ఖిన్ను
లయిరని తోచునిట్టిది యర్థశక్తి మూలము.

ఇతండు శత్రుపురంబులం గెల్చిన రాజమౌళి
యని యిట్లొక్క రాజుం జూచి చెప్పినచోఁ ద్రిపుర
సంహారకుండగు చంద్రశేఖరుండనియుం దోచుని
ట్టిదుభయశక్తిమూలము. ఇందు శత్రుపురంబులన్న
చో నరి నగరంబులన్నని యర్థంబు దోచుంగాన నా
భాగంబున నర్థశక్తి- రాజమౌళి యన్నచో నృపశ్రే
ష్ఠుండన్న నీయర్థంబు దోచదు గాన నాభాగంబున శబ్ద

శక్తియుం గూఢితో పించెంగాన నిదియుభయ శక్తి మూలము

ఇట్లుతోచు నర్థంబులు వ్యంగ్యబులనంబడు వాని విస్తరంబు వ్యంగ్యసంగ్రహమునం దెల్పంబడు.

అలంకారంబులు- శబ్దాలంకారంబులు నర్థాలంకారంబులు నుభయాలంకారంబులునని మూడు తెగలు.

అనుప్రాసయమక చిత్రపునరుక్తవదాభాసంబులు శబ్దాలంకారంబులు- ఉపమాదులర్థాలంకారంబులు- లాటానుప్రాసంబు నుభయసంసృష్టియు మొదలగునవి యుభయాలంకారంబులు.

అందనుప్రాసంబులు వర్ణానుప్రాసంబును పదానుప్రాసంబునని రెండు.

అందువర్ణానుప్రాసము వ్యంజనమాత్రసామ్యము- అది ఛేకానుప్రాసంబును వృత్త్యనుప్రాసంబునని రెండు విధములనుండును అనేక వ్యంజనంబులకొక్కమాఱావృత్తి ఛేకానుప్రాసము ఉ- ఇన్దుసున్దరుడు- ఇందు నకార దకారంబులకావృత్తి- ఒక్కటియొండెననేకంబులొండెంబెక్కుమాఱులావృత్తించుచో వృత్త్యనుప్రాసము- ఉ- రాముఁడు కామసమానుఁడు.

వృత్త్యనుప్రాసాశ్రయంబులగు వృత్తులుమూ

ము- ఉపనాగరికయుంబరుషయుంగోమలయు- అం
దుమాధుర్య వ్యంజక వర్ణంబుల నుపనాగరిక- ఓజో
వ్యంజక వర్ణంబులం బరుష- ప్రసాదవ్యంజక వర్ణం
బులం గోమల- మాధుర్యాదిగుణ లక్షణంబులును- ద
ద్వ్యంజక వర్ణంబులను వ్యంగ్యసంగ్రహంబునం జూ
చునది- ఈవృత్తులె వైదర్భి గౌడీ పాంచాలీ యనను
రీతులని వామనాదులంద్రు.

అర్థంబొక్కటియె కాఁ దాత్పర్య భేదంబు
నం బదంబావర్తించుట లాటానుప్రాసము- ఉ- గుణ
వంతుని లక్ష్మి లక్ష్మి-

ఏకార్థకంబులుగా నివ్యాజనస్వరసనుదా
యంబులనావర్తించినచో యమకము- ఉ- నెలంత
వెలంతపోను-

పద్మాద్యాకారంబులఁ వ్రాయుటకర్హంబగు
ట చిత్రము అది పద్మబంధఖడ్గబంధము రథబం
ధాది భేదంబుల ననేకవిధము- అదిబంధకవిత్వంబు
లఁజూచునది.

భిన్నాకార శబ్దంబులేకార్థంబులగునట్లుదో
చుచున్నచోఁ బునరుక్తవదాభాసము- ఉ- లెనుగా
త్రుండయ్యెనితంతు- దండమాలిక యిది.

ఇది శబ్దాలంకార ప్రకరణము.

అర్థాలంకారంబులు- అస్ఫుటప్రతీయమా

వంబులు నస్ఫుటప్రతీయమానంబులునని రెండు తెగలు- అందు మొదటివి సాధర్మ్యవిరోధన్యాయ వైచిత్ర్యతిరోధాననిబంధనంబులగుటచే నైదు తెగలు- అందు సాధర్మ్యనిబంధనంబులుపమాప్రతీపవ్యతిరేకంబులు- విరోధవిభావనా విశేషోక్తి విషమ విచిత్రా సంగత్యన్యోన్య వ్యాఘాతా తద్గుణాధిక విశేషంబులు విరోధనిబంధనములు- న్యాయమూలములు వాక్యన్యాయ లోకన్యాయతర్క న్యాయమూలములగుటచే మూడు తెగలు అందు యథాసంఖ్య పరిసంఖ్యార్థాపత్తి వికల్ప సముచ్చయోత్తరంబులు వాక్యన్యాయ మూలములు- భావికపరివృత్తి, ప్రత్యనీకతద్గుణసమాధిసమస్వభావోక్త్యుదాత్త వినోక్తులు లోకన్యాయమూలంబులు- కావ్యలింగానుమానార్థాన్తరన్యాసంబులు తర్కన్యాయ మూలంబులు- కారణమాలైకావళీ మాలాదీపక సారంబులు శృంఖలావైచిత్ర్యమూలంబులు- వ్యాజోక్తి వక్రోక్తిమీలనసామాన్యంబులు తిరోధానమూలంబులు.

స్ఫుటప్రతీయమానంబులు సాపహ్నవస్తూర సభావంబులు ప్రతీయమానములగుటం బట్టి నాల్గు తెగలు- అందురూపక పరిణామ సందేహభ్రాన్తిమదుల్లేఖాపహ్నవోత్ప్రేక్షా రూపకాతిశయోక్తిస్మరణతుల్యయోగితా దీపక ప్రతివస్తూపమా దృష్టాన్తసహోక్తి వ్యతిరేకనిదర్శనాశ్లేషంబులు ప్రతీయ

వగ నౌపమ్యంబులు- అందురూపకాదులభేద ప్ర
ధానంబులు. స్మరణాదులు భేద ప్రధానంబులు- స
మాసోక్తి పరికరాక్షేప వ్యాజస్తుత్యుపమేయోప
మానన్వయాతిశయోక్తి పర్యాయోక్త్య ప్రస్తుత ప్ర
శంసా విశేషోక్తులు ప్రతీయమానవస్తుకంబులు-రస
వదలంకారము ప్రతీయమాన రసంబు- ప్రేయ ఊ
ర్జస్వి సమాహితభావో దయభావసంధిభావశబలత
లు ప్రతీయమాన భావంబులు.

ఉపమ పూర్ణయనియు లుప్తయనియును రెండు విధంబులనుండును- శ్రౌతియనార్థియనని వెండియు రెండు విధములు- వాక్యసమాసతద్ధిత గతంబులని వెండియు మూడు విధంబులు- ఉపమానోపమేయసాధారణధర్మోపమావాచకంబులు నాల్గుఁజెప్పినచోఁబూర్ణ- అందులోనొక్కటి యొకఁడెం గొన్ని యొండెంజెప్పకున్న లుప్త- ఉ- నా ముఖము పద్మము వలె సుందరంబై యున్నదన్నచోఁ బూర్ణోపమ- ఇందుముఖముపమేయము-పద్మముపమానము సుందరత్వము సాధారణ ధర్మము- వలెనన్నది వాచకంబు. ముఖము పద్మమువలె నున్నది ముఖము పద్మసుందరము- అని యిట్లు చెప్పినచో లుప్త. ముఖము పద్మము వలెనున్నదని యిట్లు ఇవార్థకంబులగు శబ్దంబులుపమావాచకంబులయినచో శ్రౌతి- ప

ద్మమునకు సరిగా నున్నదని యిట్లు సదృశార్థకశబ్దంబు లిట్లయినచో నార్థి - ముఖము పద్మమువలె సుందరంబని యిట్లు పదములు వీడియున్నచో వాక్యగ - ముఖము పద్మసమము - ముఖము పద్మసుందరమని యిట్లున్నచో సమాసగ - ముఖము పద్మవద్భాసమానంబని యిట్లు వతిప్రత్యయంబు గూర్చినప్పుడు తద్ధితగ.

ఉపమేయమునుపమానంబగుటయు - నుపమేయంబున నుపమానవైయర్థ్యంబుం బ్రతీపము - పద్మము ముఖమువంటిది యన్నను పద్మంబుండను ముఖంబేలా యన్నను ప్రతీపము - పద్మము పగలే శోభనము - ముఖము రేయుంబగలును శోభనంబని యిట్లు విశేషము సెప్పచో వ్యతిరేకము

విరోధనిబంధనములలో విరోధంబాభాసంబయినచో విరోధము - కారణములేక కార్యము గల్గుట విభావన - కారణ సామగ్రియున్నం గార్యము గలుగమి విశేషోక్తి - కారణవిరుద్ధకార్యము వొడముటయు ననర్థము వొడముటయును విరూపవస్తుఘటనము నువిషమము - విరుద్ధకార్యోద్యోగము విచిత్రము - కార్యకారణములు వ్యధికరణములగుటయసంగతి - ఒండొంటికిం గారణమ్ముం గార్యమునగుటయన్యోన్యము - ఒక్కదానిచే సాధించినది దానిచేతనే మఱియొక్కచొప్పున సాధించినచో వ్యాఘాతము. సన్నిధాన

చున్నను దాని గుణము గలుగమియతద్గుణము. ఆ
ధారాధేయము లొండొంటికిం దగమియధికము ఆ
ధారము లేక యాధేయ ముండుటయు నొక్కయా
ధేయంబనే కాధారములం దోచుటయు నశక్యవ
స్తుత్రం జేయుటయు విశేషము.

ఉ- ఈరాజు విమల తరవారిధార శత్రువుల
కు సంతాపము సేయునన్నచో విరోధము - ఈతని
శత్రువులు గుహంజొచ్చుటరాత్రి లేకయె చీకటి వా
డము నన్నచో విభావన - వారికింబగలును వెలుం
గు లేదయ్యెనన్నచో విశేషోక్తి - ఈతని ఖడ్గంబతినీ
లంబు తెల్లని కీర్తింగనెనన్నను ఈతని శత్రువులు వి
యము నకై యుద్ధభూమిం జేరినం బ్రతుకునకై చే
టువచ్చెనన్నను రాజధానులనుండు శత్రురాజులకు
వనవాసము గలిగెనన్నను విషమము - రాజులనర్గళ
ముగా నేనుంగు నెక్కుటకీతని యొకంట నేనుగులది
గ్గుఁరన్నచో విగ్రహము - ఈతఁడు భూభారమువహిం
పహాముంతరాజమస్తకమణులు నమములయె, నన్నచో
వనంగతి - సింహాసనం బెక్కుటసీతం డొప్పెసితం
డెక్కుటసింహాసనంబొప్పె నన్నచో నన్యోన్యము.
ఇతని బాహుబాల బాహువులనే యశంమునన్న
చో వ్యాఘాతము. ఇతని కీర్తి దిక్కులు పేనం బర్విసం
తెల్ల దనము వాయదయ్యెనన్న నతద్గుణము - ఈతని

ర్తియతి విస్తీర్ణంబైయున్న బ్రహ్మాండకరండంబునని
మిడెనన్నచో నధికము. మహాపురుషులకీర్తి వారు లేకు
న్నం దోచునన్నను- ఈతని శత్రువుల కెందునీరు నిరూ
పెదోచునన్నను- ఈతనికటాక్షపాత్రంబగు వాఁడు
లోకోత్తర కృత్యములం జేయునన్నను విశేషము.

వాక్యన్యాయమూలములు.

ఏ క్రమంబున సంబద్ధార్థము లుద్దిష్టములగు నా
క్రమంబుననె యనూద్దేశము యథాసంఖ్యము- పె
క్కుచోటుల సంభావనీయంబగు నర్థము నొక్కచో
నియమించుట పరిసంఖ్య- ఒక్కటిచెప్పిన మఱియొ
క్కటికైముత్యన్యాయమున సిద్ధించుట యర్థాపత్తి-
తుల్యబలములలో నొక్కటి నియమించుట వికల్పము-
అనేకములొక్కమాఱు గలుగుట సముచ్చయము-
ప్రశ్నోత్తరంబులొండెం బ్రశ్నంబూహించుటకుఁ
దగిన యుత్తరంబొండె నుత్తరము.

ఉ. ఈతని గాంభీర్యోన్నత్యస్థైర్యంబు
లుండ సముద్రాద్రి దిగ్గజంబు లేలా యన్నచో య
థాసంఖ్యము- ఈతని రాజ్యకాలమున నతివృష్టి శత్రు
స్త్రీనేత్రంబులనే యన్నం బరిసంఖ్య- ఈతనికోప
మునకు దేవతలె వడంకుదు రింక నన్యులం జెప్ప నేలా
యన్న నర్థాపత్తి- ఓ రాజులారా యీతనియెదు
టం దలలు వంచుఁడు- లేనిచో విండ్లు వంచుఁడు అ

న్నచో వికల్పము- ఇతండు సింహాసనమెక్క సాధుహృదయములు ప్రసన్నంబులయ్యెన సాధుహృదయములు కలుషంబులయ్యెనన్నచో సముచ్చయము- ముఖ్యకథనమెయ్యది కులవిద్యయన్నను- ఇతండు రాజ్యము నొందినది మొదలు ధర్మంబు ప్రతిష్ఠితంబై యుండెనని వాఁడడుగుట యేమియన్న నుత్తరము.

లోకన్యాయమూలంబులు.

కాలాంతరమువి ప్రత్యక్షంబట్ల చెప్పుచో భావికము- ఒకటిగాని మతియొకటియిచ్చుట పరివృత్తి- తత్తిరస్కారంబు సేయంజాలక తదీయతిరస్కారంబు సేయుట ప్రత్యనీకము- తనగుణము విడిచి యన్యగుణముంగొనుట తద్గుణము- ఒక్కపని సేయంబూనినచోఁ గాకతాళీయన్యాయంబునం గారణాంతరంబుసమకూడుట సమాధి- అనురూపపదార్థసంఘటన సమము. అందముగా నున్నదియున్నట్లు చెప్పుచో స్వభావోక్తి- వస్తుసమృద్ధిని వర్ణించుచో నుదాత్తము- ఒకటివిడుచుచో రమ్యత్వంబొండె నరమ్యత్వంబొండెం జెప్పుచో వినోక్తి.

ఉ. ఈభూమియెల్లందొల్లియాదివరాహదంష్ట్రాగ్రంబున మంటిచుక్కవలె నుండెనన్నను భావికము- ఈరాజునకు మంచిపలుకు లొసంగి కవీంద్రులుమత్తగజంబులుగొనిరన్నచోఁ బరివృత్తి- ఈతని

ప్రతాపంబున కోడి బాడబంబేత గాంభీర్య బంధుర
గు సింధువును వేఁచు మన్నదన్నచోఁ బ్రత్యనీకము-
ఇతని పదనఖకాంతుల భూపాలకిరీటమణులు వెల్లన
య్యెనన్నం దద్గుణము- రణాంగణంబున రాజులిత
ని వేఁడుకొనం బోవుచో గాలిచేఁ గసవు నూరులం దూ
రుట యనుకూలం బయ్యెనన్నచో సమాధి- మదము
గారంగ కర్ణతాళంబుల విసరుచుం దొండం బాడించు
చు నేగు నేనుంగన్నచో స్వభావోక్తి- ఈరాజుం జే
రిన పండితులయిండ్ల వాకిళ్ల మదగజములు గట్టంబ
డియె నన్నచో నుదాత్తము- ఇతని గుణవర్ణన లేని కా
వ్యం బేమి కావ్యం బన్నచో వినోక్తి.

### తర్కన్యాయ మూలములు.

పదార్థంబొండె వాక్యార్థంబొండె హే
తువయినచోఁ గావ్యలింగము- సాధ్యసాధనంబులం
జెప్పుచో ననుమానము- ఒక్కయర్థము జెప్పి దా
ని సాధించు నర్థాంతరంబుఁ జెప్పుట యర్థాంత
రన్యాసము.

ఉ- శత్రురాజుల లలాటలిపి యితని సఖచం
ద్రికానేచనంబున నుచ్ఛ్వసితంబయ్యెనన్నచోఁ గా
వ్యలింగము- రజోధూమంబు వెడలెం గాన నీతని ప్ర
తాపాగ్ని వొడమెనన్నచో ననుమానము- సత్సంగం
బున దుష్టులు సునాథులగుదురు ఈరాజు సన్నిధాన

ద్యునంగలియుఁ గృతయుగంబయ్యె నన్నచో నర్థాంతరన్యాసము.

శృంఖలావైచిత్ర్యమూలకములు.

పూర్వపూర్వంబున కుత్తరోత్తరంబు కార్యంబైనచోఁ గారణమాల- విశేషణంబైనచో నేకావళి- లబ్ధోత్కర్షంబైనచో మాలాదీపకము- ఉత్కృష్టంబైనచో సారము.

ఉ. విద్యచేత వినయంబు గలుగ వినయమున గుణార్జనంబు గుణార్జనంబున బ్రజానురాగంబన్నచోఁ గారణమాల- ఈపట్టణము సుజనశోభితము- సుజనులు విభవశాలులు- విభవము నైశ్వర్యసహితమన్నచో నేకావళి- భాగ్యాతిశయంబు భూమిం జెందె- భూమియారాజభుజంబుం జెందె- భుజము ప్రతాపముం జెందె- ప్రతాపము లోకత్రయముం జెందె నన్నచో మాలాదీపకము- లోకములలో భూలోకంబు శోభిలు భూలోకమున నీదేశం బీదేశము ననీపుర మీపురము లో రాజన్నచో సారము.

తిరోధానమూలములు.

ప్రకాశంబైనది గూఢముఁ జేసి చెప్పినచో వ్యాజోక్తి- ఒక్కవస్తువు మఱియొక్క వస్తువున గూఢంబయినచో మీలనము- ఒక్కవిధమునం జెప్పిన వాక్యము మఱియొక్క విధమున నన్యులయోజించినచో

వక్రోక్తి- గుణసామ్యమున వస్త్వంతరములో వేఱు
గాఁగానరామి సామాన్యము.

ఉ. పాణిగ్రహణమునరోమహర్షణముగాఁ-ద
త్కాణిలంబతిశీతంబన్నచో వ్యాజోక్తి - ఈతనిశత్రు
రాజుల స్త్రీలు తమయాలింగనమునంబతులకుఁబొడ
ము స్వేదకంపాదులభయమూలకములని తలంతురు
అన్నచో మీలనము- నీవు సాలకానసరమ్యవని యొ
రుఁగడన నాయెడ సాలవనంబెక్కుడిదనుట వక్రోక్తి-
ఇతనికీర్తి చేనన్నియుఁదెల్లనివైనబ్రహ్మతనవాహనము
వెదకుచున్నాడన్నచో సామాన్యము.

ప్రతీయమానౌపమ్యములు.

ఆరోప విషయమున కారోప్యమాణముప
రంజకంబయినచో రూపకము- అదిసావయవము-
నిరవయవము - పరంపరితమునని మూడు విధములనుం
డును- అంగసావయవమునకు సమస్తవస్తు విషయం
బునేకదేశవివర్తియునని రెండుభేదములు- నిరవయ
వమునకుఁ గేవలము మాలారూపకము నని రెండు.
పరంపరితమునకును శ్లిష్టనిబంధనమున శ్లిష్టనిబంధ
నము నని రెండును కేవలమును మాలారూపమునని
రెండును- ఇట్లెనిమిది భేదములు.

ఉ. ముఖపద్మము నేత్రభ్రమరశోభితంబని యి
ట్లవయవావయవుల రూపించినచో సమస్తవస్తు విష

యము - గుణపుష్పంబుల నీరాజు దిక్కులం బరిమళింపం జేయుననిి యిట్లు వయవ రూపణంబు నేయ నీ రాజును కల్పవృక్షంబని యిట్లవయవి రూపణంబు దోచుంగా ననేక కోశసంపర్తి- శాఖా పద్మంబన్నచో కేవలనిరవయవంబు- ఈతని కీర్తి రాజ శిరోమాలిక దిగ్గజశ్రోత్రచామరంబన్నచో మాలానిరవయవము- రూపకహేతు రూపకము పరంపరితము- ఈతని ఖడ్గరాహువు రాజమండలంబు మ్రింగుచున్న దన్నచో శ్లిష్ట కేవలపరంపరితము. ఇతండు పద్మోల్లాస రవి కువలయాలంకార చంద్రుండన్నచో శ్లిష్ట మాలా పరంపరితము- ఈరాజ చంద్రుని యశశ్చంద్రిక యెల్లెడను వెలుంగునన్నచో నశ్లిష్ట కేవల పరంపరితము. ఇతని విలాసము లుభయాంధకార మధ్యాహ్నములు కైతవాతపత్రములన్నచో నశ్లిష్ట మాలాపరంపరితము.

ఆరోప్యమాణము ప్రకృతోపయోగియయినచో పరిణామము- సంశయము గల్గుచో సందేహము- భ్రాంతి గల్గుచో భ్రాంతిమంతము- అనేకు లొక్కని ననేకవిధముల నుల్లేఖించిన నుల్లేఖము- పర్యాయమును గొందసటయపహ్నవము-

ఉ- ఇతని యాజ్ఞామాలికను రాజులు మస్తకములందాల్తు రన్నను రంకానుమము- ఇది ముఖం

బో పద్మంబో యన్న సందేహము- తుమ్మెదలు పద్మంబని ముఖముం జేరెనన్న భ్రాంతి మంతము - ఇతండు శౌర్యాకరంబని శత్రురాజులును- విద్యావిహారస్థానంబని పండితులు నెన్నుచున్నారన్న నుల్లేఖము - ఇది ముఖము గాదు పద్మంబన్నను ఇది పద్మముగాని ముఖము గాదన్ననుముఖవ్యాజమునం బద్మంబె యొప్పుచున్నదన్న నపహ్నవము

ప్రకృతమున ప్రసిద్ధోపమానముగా నుండెడదానికి హేతువొండె ఫలము నొండెం గల్పించుటయుత్ప్రేక్ష- అదివాచ్యయుగమ్యయునని రెండు విధములనుండు- వలె- అట్లు- నిక్కము - ధ్రువమిత్యాది శబ్దంబులం బ్రయోగించినచో వాచ్యయగునది లేనిచో గమ్యయగు.

ఉ. చీకటి చక్రవాక విరహాగ్ని ధూమంబువలెనున్నదన్నను స్వరూపోత్ప్రేక్ష - నీపాదంబులు భూమినుంచుట వలన నెఱ్ఱవారినవి నిక్కమన్నచో హేతూత్ప్రేక్ష- ముఖకాంతింజెందుటకుంగాబోలు చంద్రుండు పద్మములతో వైరము సేయుచున్నాడన్నచో ఫలోత్ప్రేక్ష- ఈమూడును వాచ్యోత్ప్రేక్షలు-ఇంక వలెను- నిక్కము- కాబోలును అనుశబ్దముల విడిచి చెప్పినచో గమ్యోత్ప్రేక్షయగును.

ఉపమేయంబు నెప్పక యుపమానంబె సెప్పినచో రూపకాతిశయోక్తి. ఉ-॥ రాజకులంబున ని కల్పవృక్షములై- పద్మముఁ జూచి ముఖముం దలంచితి.

సమానముం జూచి సమానముం దలంచుట స్మరణము.

ప్రస్తుతంబుల కొండె నప్రస్తుతముల కొండె సమాన ధర్మము సెప్పుట తుల్యయోగిత- ప్రస్తుతాప్రస్తుతములకది దీపకము.

ఉ. ఇతండు రాజ్యము సేయంగిర్తులను శత్రుకాంతలకుం బాండిమ గలిగె నన్నం గూమణమును శేషుండును దిగ్గజములును నిస్సారములయ్యె నన్నం తుల్యయోగిత- ఇంద్రుండు నీ రాజును లోకములం గాచుచున్నారన్నచో దీపకము.

వాక్యద్వయంబున వేఱుగా నొక్క సాధారణ ధర్మము సెప్పినఁ బ్రతివస్తూపమ- బింబప్రతిబింబభావమునం జెప్పినచో దృష్టాంతము- ఉ- మందరము సముద్రమునకు శోభకము- ఈ రాజు శత్రుపురము శోభకుండు- అన్నచోఁ బ్రతివస్తూపమ- మేరువుచే ప్రతిష్ఠ- ఈ రాజుచే మహిమయన్నచో దృష్టాంతము.

ఒక్కదానితోఁ గూడ నొక్కదాని క్రియయ

యినచో సహోక్తి - ఉ - ఈతని ఖడ్గలతశత్రు
కంఠముల యందు దేవస్త్రీ పుష్పమాలికలతోఁ బడు
చున్నదన్నను ఇతనికీర్తి దినదినమును సూర్యునితో
నుదయించుచున్నదన్నను సహోక్తి.

ఉపమాన ధర్మము పమేయమున నున్న
దన్నను బింబ ప్రతిబింబభావము దోచుచో నిదర్శ
న - ఉ - ముఖము పద్మశోభం దాల్చుచున్నది.

ఉపమేయము పమానముకంటె విలక్షణం
బగుట వ్యతిరేకము - ఉ - పద్మము రేయి శోభిల్లదు -
ముఖము రేయుంబగలు శోభిల్లును -

అర్థము వేఱగుచో శబ్దమొక్కటియయి
నను శ్లేషము - ప్రకృతశ్లేషం బప్రకృతశ్లేషము భ
యశ్లేషము నని యది మూఁడు విధములనుండును -
వెండియును భంగశ్లేషము సభంగశ్లేషము నని
రెండు విధములగును - ఉ - వీరలు సుమిత్రానంద
నులని రామలక్ష్మణుల నుద్దేశించి చెప్పినను - ఈతని
కింగులభూభృత్తులు సాటియన్నను - ఇందుడు చం
ద్రుండును కళానిధియన్నను శ్లేషము. ఇది నీరజంబ
న్నను పరమహిమంబన్నను సభంగశ్లేషము.

ప్రతీయమాన వస్తుకములు.

ప్రస్తుత విశేషణంబు సామ్యంబున నప్ర
స్తుతంబుఁదోపించుచో సమాసోక్తి - సాభిప్రాయం

బయినచోఁ బరికరము - ఉ. ఇతనివాణి సరసనగు
ణసాలంకార యన్నచో నాయిక దోచుంగాన స
మాసోక్తి - చతుర్భుజుఁడు మాకు నాల్గుపురుషార్థ
ము లనొసంగునన్నచోఁ బరికరంబు.

విశేషము దోచుటకుం జెప్పిననిషేధాభాస
మాక్షేపము - ఉ. మేము శరణులమనుట యెట్లు సర్వ
లోకశరణంబవు నీవుండ నన్నచో నాక్షేపము.

నిందచే స్తుతియుండె స్తుతిచే నిందయుండెం
దోచుచో వ్యాజస్తుతి - ఉ. ఇతఁడు బుద్ధిమంతుండ
ట - పరోపకారంబులం జేసి తన కార్యంబులను పే
క్షించు నన్నను ఈతని శత్రువు లెంత సాహసిక
లు సంభ్రమములం జొచ్చుచున్నారన్నను వ్యాజస్తుతి.

భేదంబున్న నభేదం బభేదంబున్నను భేదం
బు సంబంధంబున్న నసంబంధం బసంబంధం
బున్నను సంబంధంబును జెప్పినం గార్యకారణ పౌ
ర్వాపర్యము నతిశయోక్తి - ఉ - ఇతఁడు కల్పవృక్షం
బే యన్నను - ఇతని మహిమ యన్యంబే పోయన్నను
ఇతని సృష్టి బ్రహ్మసృష్టిలోనిది గాదన్నను - ఇతని ప్ర
స్తావము దేవలోకమున నడచినదన్నను - ఈయువ
తిదృష్టి ప్రసారమునకు మున్న మన్మథశరము లు
పమునన్న నతిశయోక్తి.

ఒక్కటియె ఉపమేయము నుపమానము నయిన

చోఁ ననన్వయము - పర్యాయమున రెండట్లయిన చో నుపమేయోపమ - ఉ - ముఖము ముఖమువలెనున్న దియన్న ననన్వయము - ముఖము పద్మము వంటిది పద్మము ముఖము వంటిదన్నచో నుపమేయోపమ -

ప్రస్తుతార్థమునం బ్రస్తుతార్థము దోఁచినం బర్యాయోక్తి - అప్రస్తుతమున నది దోఁచిన నప్రస్తుత ప్రశంస - ఉ - ఈకని సైనికులు శత్రురాజుల యంతః పురదీర్ఘికల స్నానము సేయుచున్నారన్నచోఁ బర్యాయోక్తము - తుమ్మెదలు దిక్కులందిరుగుటచే నేమి లాభము - నవనవోదయంబై పున్నాగము పరిమళం బిడుచున్నదే యన్నచో నప్రస్తుత ప్రశంస -

రసభావ రసాభాస భావశాన్తు లితరాంగములయినచో రసవత్ప్రేయ ఊర్జస్వి సమాహితములనం బడు - భావోదయభావసంధిభావ శబలత లట్లయినప్పుడా పేరులయలంకారములగునవి - యన్న తత్ప్రత వ్యాంగ్యసంగ్రహమునం జూచిన నవి స్పష్టంబగు.

అనేకాలంకారము లొక్కవాక్యమునం గూడినచో సంసృష్టి సంకరములగును - అవి తిలతండులములవలె నన్యోన్య నిరపేక్షములయినచో సంసృష్టి - నీరక్షీరములవలె నన్యోన్యసాపేక్షములయినచో సంకరము - చంద్రునివంటి యీ ముఖము పద్మశోభం గొల్లునన్నచో నుపమా నిదర్శనలకు

సంసృష్టి.

అంగాంగి భావము నేక వాచకానుప్రవేశ
మును సందేహమునని సంకరములు మూడు ఈతని
ఖడ్గధార శత్రువుల లలాటముల లిపులంగడు గంగా
బోలుచుబడుచున్నదియన్నచో నుపమోత్ప్రేక్షలకం
గాంగి భావము -

విలసత్సర్వమంగళుండితండు శివునివలెనె
వ్వననన్నచో నుపమాశ్లేషములకేక వాచకానుప్ర
వేశము - ఈ రాజచంద్రుండు రసికులాంబుధింబు
ట్టైనన్నచో నుపమారూపకములకు సాధకబాధకం
ములు లేవుగాన సందేహము ॥

ఇది శ్రీ పురవస్తు వేంకటరంగాచార్యు
లయ్యవారలుంగారిచే రచియింపంబ
డిన యలంకార సంగ్రహము.

VIZAGAPATAM.
Printed by A. C. Srinivasacharier,
Aisha Press. 1874.

డు- కొంగానియట్టిభాగము స్వాచిత్యముగాని ప్రా
యికముగాదు ఎందువలన నన్నను- స్మృతి గ్రంథకా
రులు శ్రుతులతాత్పర్యము లెస్సగానెఱింగినవారలు
గానియన్యులు గారు- అట్టివారలు ప్రమాదవశమును
నంగాక శ్రుతి విరుద్ధార్థవచనంబులు వలుకుదురే-
ప్రామాదికంబులోయున్న నెంత బుద్ధిమంతులకుఁగ
లుగును - ప్రమాదో ధీమతామపి యను వచనంబు
సుప్రసిద్ధము గాదే.

అట్టి స్మృతులెయ్యవి యనినను-

మను స్మృతి అత్రి స్మృతి విష్ణుస్మృతి హారీత స్మృ
తి యాజ్ఞవల్క్య స్మృతి ఉశన స్మృతి అంగిరస్స్మృతి-
యమ స్మృతి ఆపస్తంబ స్మృతి-సంవర్త స్మృతి కాత్యా
యన స్మృతి బృహస్పతి స్మృతి- పరాశర స్మృతి-వ్యా
స స్మృతి శంఖ స్మృతి లిఖిత స్మృతి దక్ష స్మృతి గౌత
మ స్మృతి శాతాతప స్మృతి వసిష్ఠ స్మృతి-

మఱియును నారద పులస్త్య క్రతు దేవల- మ
రీచి పితామహ వ్యాఘ్రపాద భరద్వాజ శ్వలాయన
బోధాయన భృగు మార్కండేయ గోభిల కౌశిక జా
బాలి ప్రజాపతి శౌనక గర్గ పుణ్డరీక జైశినసి నారాయ
ణ విశ్వామిత్ర లౌగాక్షి వృద్ధమను వృద్ధవసిష్ఠ వృద్ధ
యాజ్ఞవల్క్యాది స్మృతులు ననేకంబులు గలవు.

ఇందులోఁ గొన్ని శ్లోక రూపములుగానున్న

వి కొన్ని వాక్యరూపములుగా నున్నవి.

ఇవి యెవ్వరు చేసిరన్నను ఆయా స్మృతుల నామంబుల నిరూపించినచో నవియొక్కొక్క ఋషి పేరనున్నవి- ఆయా ఋషులే చేసినారని యందురు- కానియుండొక్క సంశయ హేతువు గలదు- ఇందులో శ్లోక రూపములుగా నున్న స్మృతులు ఆయా ఋషుల కాలములనే పుట్టిన వనవలసియున్నవి అత్ర్యంగిరో బృహస్పతి దక్ష గౌతమాదులు మిక్కిలియుం బురాతనులు- వారలు వాల్మీకికంటెను ప్రాచీనులు వాల్మీకి పుట్టకమున్నె వేదమంత్రము దక్క ఛందోనిబద్ధమగునది లేదని ప్రసిద్ధమైయున్నది- అందువలననే వాల్మీకి యాదికవియని చెప్పఁబడియె నందురు- ఇట్లగుటనప్పుడు శ్లోక కవిత్వము పుట్టుట సంశయగ్రస్తమై యున్నది-

ఇంతియ గాక యీ స్మృతులలోనే కొందఱు శిష్యులు ప్రశ్నను చేయగా నాయా ఋషులు చెప్పినవాక్యములే యీ స్మృతులని కానవచ్చుచున్నవి- ప్రశ్నములు నుత్తరములును వాక్యరూపములగుట సహజము- గాని యప్పటికప్పుడు వారు శ్లోకరూపములగు వాక్యములం బ్రశ్నములు సేయుచుండిరని యీ శ్లోక రూపములగు నుత్తరంబుల ఋషులు సెప్పిరనియు నమ్ముటకర్హంబై యుండలేదు. ఇంతియ

గాక మనువు చెప్పినది భృగువు గ్రంథరూపముగాఁ జేసినట్టు మనుస్మృతియందే కాన వచ్చుచున్నది- శ్లో॥ ఇదం శాస్త్రంతు కృత్వాసౌ మామేవ స్వయమాదితః- విధివద్గ్రాహయామాస మరీచ్యాదీనహం మునీన్ -ఏతద్వోఽయంభృగుశ్శాస్త్రం శ్రావయిష్య త్యశేషతః। ఏతద్ధిమత్తోఽధిజగే సర్వమేషోఽఖిలం మునిః। తతస్తథా సతేనోక్తో మహర్షిర్మనునా భృగుః తానబ్రవీదృషీంత్సర్వాన్ ప్రీతాత్మా శ్రూయతామితి- అని (౧ అధ్యా) ౫౮, ౫౯, ౬౦ శ్లోకములు.

మఱియు యాజ్ఞవల్క్యస్మృతి వ్యాఖ్యానము సేయుచో విజ్ఞానేశ్వరయోగియు జ్ఞవల్క్యుండు ప్రశ్నోత్తర రూపంబుగాఁ జెప్పినది తచ్ఛిష్యుఁడొకఁడు శ్లోక రూపంబుగాఁ జేసెనని చెప్పియున్నాఁడు యాజ్ఞవల్క్య శిష్యః కశ్చిత్ప్రశ్నోత్తర రూపం యాజ్ఞవల్క్య ప్రణీతం ధర్మశాస్త్రం సంక్షిప్య కథయామాస యథామనుప్రోక్తం భృగుః- తస్యచాయం ప్రథమశ్లోకః- అని.

ఇందువలన ఋషులు చెప్పిన వాక్యంబులను సంగ్రహించి వారి శిష్యులు స్మృతి గ్రంథంబులను రచించినట్టు కానవచ్చుచున్నది.

ఇందు నుక్క సంశయంబుగలదు. వారిశిష్యులును వారి [illegible] లంబుల [illegible] కదా వారు చేసియు

న్న రొండను స్వాయంభువ మనువు కాలంబులోని వాఁడయిన భృగుమహాముని చెప్పినట్లున్న మనుస్మృతిలో స్వాయంభువ మనువుగాక మఱి యాఱుగురు మనువులు పుట్టిన వెనక తాను చెప్పుచున్నట్టుగాన వచ్చుచున్నది- స్వాయంభువస్యాస్య మనోష్షడ్వంశ్యామనవోఽపరే| సృష్టవన్తః ప్రజాస్స్వాస్స్వా మహాత్మానో మహౌజసః- అని మను(౧ అ. ౬౧ శ్లో) భృగుమరీచ్యాదులో యున్నను సృష్ట్యాదియందే బ్రహ్మమానస పుత్రులై పుట్టిరని పురాణములంగానవచ్చుచున్నది.

ఇందువలన నున్న మన్వాదులు శిష్యులకుపదేశించిన ధర్మములు శిష్యప్రశిష్యపరంపరాగతములయ్యెననియుం జిరకాలమునకు నాపరంపరలోని వార లెవ్వరో గ్రంథరూపంబుగాఁ జేసిరనియు నూహింప వలసి యున్నది-

ఇందు మఱియొక్కటి విచారింపవలసియున్నది- మన్వాదులు చెప్పినమాటలే యీగ్రంథములలోఁ జెప్పంబడినవా లేక తత్కాలంబు వారలు మఱి కొన్ని కూడంజేర్చి చెప్పియున్నారా- మన్వాదులు చెప్పిన మాటలు మాత్రమే చెప్పిరన నవకాశంబు లేదు. ఎట్లంటేని మనుస్మృతియందు ౯ అధ్యాయంబున సంతానము లేని విధవకు నియోగంబున దేవరను

పింగానాముపనం బుత్రోత్పత్తి సేయవలయునని చెప్పి- అది వేనుని రాజ్యకాలంబున నుండెననియు నాపిదప వారలా ధర్మంబు గూడదని పరిహరించిరనియుం జెప్పి నియోగము నిషేధింపంబడి యున్నది-

అయం ద్విజైర్హి విద్వద్భిః పశుధర్మో విగర్హితః। మనుష్యాణామపి ప్రోక్తో వేనే రాజ్యం ప్రశాసతి॥ ౬౬॥ స మహీమఖిలాం భుంజన్రాజర్షిప్రవరః పురా। వర్ణానాం సంకరం చక్రే కామోపహతచేతనః ౬౭॥ తతః ప్రభృతి యో మోహాత్ ప్రమీతపతికాం స్త్రియం। నియోజయత్యపత్యార్థం తం విగర్హంతి సాధవః॥ అని.

ఈ వాక్యములందలి మనువు మొదటివాఁడగు స్వాయంభువ మనువు నెప్పటి సందర్భము గాదు గదా- ఇంతియగాక విధవానియోగము కలియుగ వర్జ్యములం బరిగణింపంబడి యున్నది- సకలధర్మసారజ్ఞుఁడగు వేదవ్యాసమహర్షి తాననియోగంబున విధవలయందు ధృతరాష్ట్రాదులం బుట్టించెనని మహాభారతంబున గల్గును- ఇది ద్వాపరాంతమున నడచినది- ఇట్లుండగా విధవానియోగము వేనరాజ్యము గడచినది మొదలుగ నిషిద్ధమనుట యెట్లు- ఇందువలన నిట్టివాక్యము లాధునికులచేతఁ బ్రక్షిప్తములయ్యెనని యూహింపవచ్చును- అందువలన మనస్మృ

దిస్మృతులుగాన నవచ్చు వాక్యంబులెల్ల మన్వాదులు చె
ప్పినవిగావనిస్పష్టముగాఁ దెలియవచ్చును- అట్లైన
చో మన్వాదులు ధర్మములం జెప్పుటయే కల్లయనియు
నీగ్రంథము లన్నియు నాధునికకల్పితములే యగునని
యుం జెప్పవచ్చునే యందురు- అట్లుగాదు- వేదము
ననే మనువుచెప్పిన ధర్మము మిక్కిలియు హితమని
చెప్పంబడియున్నది- స్మృతులలో చెప్పిన ధర్మం
బులు తరుచుగా వేద తాత్పర్యము ననుసరించి యు
న్నవి-విశేషించి యిందలిధర్మంబులం జూడ బహుదూ
రదృష్టిచే నైహికాముష్మికానేక ఫలోపయోగులగు
నట్లు చెప్పంబడినవని బుద్ధిమంతులకుం దెల్లమగుచు
న్నది- ఇట్లుండ నన్నియుం గల్పితములనుట యెట్లు-
కావున మన్వాదులు చెప్పిన ధర్మంబులుం దత్తత్కా
లంబునం దమదృష్టిని ప్రజలకుహితములనితో
చిన ధర్మంబులుం గూర్చి యీయుగంబులోని వారలే
యీగ్రంథంబులను రచించియుందురు- వారలు బహు
ప్రాజ్ఞులునుమనకంటెం బ్రాచీనులుంగాన మన మెఱుం
గని యుత్పన్న వేదభాగంబుల నెఱింగినవారలుగాన
వారలు చేసినస్మృతులన్నియు నాదరణీయంబులే-
వారలును ఋషితుల్యులుగాన ఋషులని మన మొప్పు
కొనవచ్చును- వారి పేరులిట్టివని మన మెఱుంగకున్న
ను ఎవ్వండే పేర ధర్మంబులు నిర్ణయించెనో యని నెయ్యా

స్మృతివచనంబులు మిక్కిలియుఁ బ్రామాణ్యంబులు-పర
స్పరవిరుద్ధస్మృత్యుక్తంబులలో సమానబలంబు లగు
నట్లుదోఁచునది వైకల్పికంబులని యెఱుఁగునది. ప
రస్పరవిరుద్ధస్మృతిభాగంబులలో శాఖాభేదంబులం గొ
దలుకొన్నిటి నాదరించియున్నారు-బహుజనసమ్మతం
బగుట నట్లాచరించుట యే శ్రేయస్కరంబగును గా
ని యేస్మృత్యుక్తంబుచొప్పునం జేసినను వైదికధర్మ
భ్రష్టుండు గాకుండునని యెఱుఁగునది- అందువల
నందఱుతమశాఖవారలాచరించుస్మృతులం జెప్పినట్లు
సేయుటశక్యంబుగాని యప్పుడు స్మృత్యంతరోక్తవి
ధినేనిం జేసినచోఁ గృతకృత్యుండని యెఱుంగవచ్చు
ను గావనిన్ని స్మృతులుం గార్యకరంబులేయని యె
ఱుంగునది.

ఇంకొక్క రహస్యంబు గలదు- స్మృతులయం
దుం జెప్పు విధినిషేధంబులన్నియు నదృష్టప్రయో
జనంబులె కావు- దృష్టప్రయోజనంబులం బట్టియు
నుండును- అయినచో నవి ప్రత్యక్షాది ప్రమాణంబు
లనే తెలియంబడుం గదా యింత చెప్పనేలాయం
దురు- అతి సూక్ష్మబుద్ధులకుం గాని తెలియ శక్యంబు
గాని దృష్టప్రయోజన సాధనంబులు నుపదేశించుట
యందఱకు నావశ్యకంబు- సూక్ష్మబుద్ధులు ప్రయ
త్న పూర్వకంబుగాక యెఱుంగరాని యర్థజము న

ట్టి క్లేశంబు లేకుండం దెలుపుట వారలకుం గార్యక
రంబు- ఇతరులకది యజ్ఞాతజ్ఞాపనంబె యగును-
అట్లైనచో స్మృతులు ధర్మశాస్త్రంబులనుట యెట్లు
న్నను- ఇందు చెప్పంబడు దృష్టప్రయోజన సాధనం
బులుండ దద్ద్వారంబున నదృష్టసాధనంబు లేయగును అ
దృష్టలాభంబున కుపయోగింపని దృష్టసాధనంబులు
చెప్పంబడవు- అద్వారకంబు గాఁ గొన్నియును ద్వా
రకంబు గాఁ గొన్నియు నదృష్ట ఫలసాధనంబులగునిం
తియ విశేషంబు- గాన ధర్మశాస్త్రంబనుటకు బాధ
కంబు లేదు-

శ్రుతులయందు నైనం గూ దృష్టఫలసాధనంబు
లైనవి తద్ద్వారంబుననె యదృష్టసాధనంబు లగునని
పూర్వమీమాంసయందు నిరూపింపంబడుచున్నది-

కావున సర్వథా దృష్టఫలస్పర్శంబు లేనిచో
(గేవలాదృష్టఫలకంబులగుం గాని యేమని యుండ
త్స్పర్శంబున్నచో నట్టివి గావు- కాఁబట్టి ప్రాయికం
బుగా స్మృత్యుక్త ధర్మంబులకు దృష్టఫలంబులు నె
దుకు చుండునది అవియేమియుం దొరకొననిచోఁ గే
వలాదృష్ట ఫలకంబులని యెంచంగునది.

ఇందుకు దాహరణంబు- నచైవాత్యశనం కుర్యాత్
అని యతిభోజనంబు వలదని చెప్పంబడినది- అతిభో
జన నిషేధము- ఆరోగ్య సాధకంబు- తద్ద్వారంబునే

నాయుర్వృద్ధి సాధకంబు- తద్ద్వారంబున స్వర్గసా
ధకము గుచున్నది- ఈ యర్థంబు- అనారోగ్య ము
నాయుష్య మస్వర్గ్యంచాతిభోజనమ్- అనువాక్యం
బున విశదీకరింపఁబడినది- ఇట్లుకొన్ని సుస్పష్టంబు
గాఁ దెలియవచ్చును- కొన్నిటి ప్రయోజనంబులు వి
మర్శ సాధ్యంబులు ఎట్లన్నను.

అసపిణ్డా చయామాతు రసగోత్రాచ యాపి
తుః- సాప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణిమైథునే
అని వివాహ విధిలోఁగన్యక వరునకు సపిండురాలు
గాకుండవలయుననియు సగోత్రురాలుగాకుండవ
లయుననియుం జెప్పంబడినది- వివాహఫలంబు పు
త్రోత్పత్తిగాన నది శుక్లశోణిత సంభవంబుగాన నవి
యేక శరీర సంబంధంబులైనచో బలహీనంబులయి
పుత్రోత్పత్తి ప్రతిబంధంబు నొండె దుర్బలపుత్రో
త్పత్తినొండెం జేయును- కాఁబట్టి యెంతదూర సం
బంధంబగునంతలెస్సయగు నిట్టిగూఢప్రయోజనము
దూర విమర్శ సాధ్యము -

ఇట్లు విధినిషేధంబులకుం బ్రయోజన విమర్శం
బొందకున్నను -మూఢ గ్రాహంబున విహితంబులాచ
రించి నిషిద్ధంబులు మానెదననుకొనువాఁడొక్కఁడు వ్వా
డు ప్రమాదమునుం జెందునెట్లన్నను- గత్యంతరములే
నిచోటున విధి నిషేధంబులలో నొక్కఁటి నున్నించి

నచో సూక్ష్మనాని నతిక్రమించ వలసి వచ్చును-దాని నున్లంఘించినచో దీని నతిక్రమించ వలసి వచ్చును. అట్టి యెడ వాని ప్రయోజనంబు లెఱింగినవాఁడు దేని ప్రయోజనం బనన్యథా సిద్ధమో దాని నాచరించి దేని ప్రయోజనం బన్యథా సిద్ధమో దాని నుల్లంఘించి ధర్మంబు నెడబుండు-నవియెఱుంగని వాఁడు మూఢగ్రాహంబున సంశయగ్రస్తుండై యెందుం జేయం జాలక ధర్మభ్రంశంబు నెందు.

కావున నే కాలభేదంబునం గొన్ని ధర్మంబులు తత్కాలమునందలి ప్రాజ్ఞులు మాఱ్పుటయుంగాన వచ్చుచున్నది- ఇదియె కలియుగ వర్జ్యంబులని కొన్ని ధర్మంబులు మాఱ్పుట కవకాశంబొసఁగినది- అట్లుగాక స్మృత్యుక్తంబులెల్ల నవిచాల్య ధర్మంబులయినచో వీరల యిష్టము చొప్పున నవి మాఱ్పుటకెట్లవకాశము గలుగును-

కావున నే-మశ్వాలంభం గవాలంభం సన్న్యాసం పలపైతృకం దేవరాచ్చసుతోత్పత్తిం కలౌ పంచ వివర్జయేత్ - అని నిషేధించుటయు వెండియు నందు లోఁబరిగణితంబయిన సన్న్యాసంబు ప్రాజ్ఞులుద్ధరించుటయుం గాన వచ్చుచున్నది- ఇందువలనం గలియుగ వర్జ్యంబులని కొంతకాలంబున మనుష్యు వ్యవస్థ చేసిన విధినిషేధంబులు గలవు-అవి

యిప్పటి యనుపపత్తులం బ్రబల ధర్మబాధకంబుల
యినవి గాన వాటిని నిషేధించిరి- వానియనుపపత్తి
దీరిన కాలంబునం గూడ నాయంశంబు నాదరించి
యుండుట మూఢ గ్రాహంబుగాన సన్న్యాసంబును
ద్ధరించినట్లు అట్టిధర్మంబులను ద్ధరింపవచ్చును-అదియె
ట్లనిన నక్షత పునర్వివాహంబు సేయుట వలనంద
త్కాలంబునం బ్రబలుఁడగువాఁడు కామాతురుడై యె
క్కొక్కండ నేకులం బెండిలియాడనుద్యుక్తుండై యిష్ట
లయినవారల-భర్తలకు నిమిత్తకల్పనంబునంగపటంబు
నహాని చేసి పెండిలి సేసి కొనందలంచుట మొదలగున
పాయంబుల నూహించి నిషేధించి యుండురు- ఇ
ప్పుడట్టి యుపద్రవంబులు లేకుండుటయు నందు
కు బదులుగా విధవలు కామాతురలయి రహస్యకృ
త్యంబులం జేసి యవి ప్రకటంబులు గాకుండ భ్రూ
ణహత్యాదులు సేయ సాగుచున్నారు- గాన నిప్పు
డు వెండియు నదియుద్ధరించుట ధర్మంబనిబుద్ధిమం
తులూహింపుచున్నారుగదా- ఇట్టి సాధక బాధకం
బు లెఱుంగని వారలు కలియుగవర్జ్యములని చెప్పి
ననవీనవచనము నే మూఢ గ్రాహముగా మన్నింపు
చున్నారు-కాకున్నచో స్మృతి ధర్మంబులు నవీనవ్య
వస్థలచే మాఱినచో నంతకంటె నవీనులగుబుద్ధిమం
తులు సేయు వ్యవస్థలచే నవియును మాఱవచ్చునని

యేలతోఁచదు.

కాఁబట్టి స్మృత్యుక్త ధర్మంబుల మూలంబు లెఱింగి నడుచువార లెన్నటికిని ధర్మంబు చెడకఁ గాపాడుదురని యెఱుంగునది.

ఇది శ్రీ పరవస్తు వేంకటరంగాచార్య
లయ్యవారలుంగారిచే రచియింపంబ
డిన స్మృతి సంగ్రహము.

VIZAGAPATAM.
Printed by A. C. Srinivasacharier.
Arsha Press. 1874.

